శ్రీ ర స్తు.

# విషకేసరి.

( అపరాధ పరిశోధక నవల. )

ప్రథమభాగము.


గ్రంథకర్త:

శ్రీయుత. జె. రంగస్వామి రెడ్డి గారు.



తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున

ముద్రింపబడినది.

1 9 3 5




[వెల రు 0-8-0

శ్రీ ర స్తు.

# విష కేసరి

( అపరాధ పరిశోధక నవల. )

ప్రథమభాగము.

గ్రంథకర్త:

శ్రీయుత. జె. రంగస్వామి రెడ్డి గారు.

తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున

ముద్రింపబడినది.

1935

 [వెల రు 0-8-0

# అంకితము

—o—

సీ॥ పరకాంత నిజమాత ♦ కరణి భావించిన
ఘనపుణ్యమూర్తి నా ♦ కన్నతండ్రి
ప్రజల క్షేమము నెంచి ♦ బహుకష్టములను జే
కొన్న వాఁడిలను నా ♦ కన్నతండ్రి
దీనసాధుల సదా ♦ ప్రీతిమై తనరార
గాంచిన వాఁడు నా ♦ కన్నతండ్రి
లలిత భాగవతకా ♦ లక్షేపమున బ్రొద్దు
గడపిన వాఁడు నా ♦ కన్నతండ్రి

తే॥ గీ॥ అట్టి జనకుండు సంతతం ♦ బాకసమున
చుక్కవోలె వెలుంగుచు ♦ సుంకిరెడ్డి
విష్ణుసాన్నిధ్యమును గాంచె ♦ వేడ్క నాదు
కృతి నొసంగెద నతని కం ♦ కితముగాఁగ.

ఇట్లు భగవద్భక్తుడు,

జె. రంగస్వామిరెడ్డి.

# ఉపోద్ఘాతము

సుధీమణులారా!

అశేషాండకోటి బ్రహ్మాండేశ్వరుండగు శ్రీవిశ్వంభ రాత్మజహృద్భృంగ ఘోరాంమదభంగుని యనుగ్రహంబుననే నీనవలారాజంబును పరమానందమున వ్రాయబూనుట కిదియే ప్రథమమగుటచేతను వయసున నేను పిన్నవాడనగుటచేతను దీనియందెన్నియో స్ఖాలిత్యము లుండవచ్చునని నాహృదయ మాందోళన జెందుచున్నది, కాన నోగుణగ్రహణ పారీణులగు పాఠకమహాశయులారా! ఈగ్రంథచూడమణి నాది నుండి తుది వరకు బఠించి తప్పొప్పులు శాంతమతులై నాకెరుక పరచిన యెడల పునర్ముద్రణమునందు సవరించుకొనుటయే గాక నాభాషాభివృద్ధికి మీ రేకృపదోడ్పడిన వారగుదురు.

—♦ దోషదృష్టులకు విజ్ఞప్తి. ♦—

తే॥గీ॥ తెలిసి తెలయక తప్పుల ♦ గల్పిచదివి
బాగలేదని గ్రంథంబు ♦ బార వేసి
విద్యలో నన్ను మించెడి ♦ విజ్ఞు డెందు
కలడటంచును విఱ్ఱవీ ♦ గంగ వలదు.

తే॥గీ॥ ఒకరి పాండిత్యముం జూచి ♦ యోర్వలేక
మనమునం గుందుచుండు న ♦ మాన్యులాగ
సదయులై మీరు నాదు పు ♦ స్తకము వంక
బరప కుండుదు గాక ని ♦ ష్కరుణదృష్టి.

ఇట్లు,

కృతికర్త.

# విన్నపము

చ॥ సనకసనందనాదిసుర ♦ సన్మునులన్ మదిలోఁ దలంచిన
న్ననిశము బ్రోచు రామునకు ♦ నర్థితోఁ పూజలు చక్కఁ జేసినా
మనవి ఘటించి నే హృదయ ♦ మందున నెంచిన కోర్కెలున్ ఫలిం
చునటుల గావుమా యనితి ♦ శూలకరాబ్జసుతున్ నుతించి నే
నినుదలపోసి పుస్తకము ♦ నిర్మలభక్తితోఁ జేతబట్టితిన్
మనమున నుంచి నా రసన ♦ మందున నిల్చి కృపారసార్ద్రతన్
వనధర జృంభణోక్తుల న ♦ వార్యమతిన్ పలికింపు భారతీ!
యనివిధి భార్యనున్ బొగడి ♦ యాదికవీశ్వరులన్ స్తుతించినా
జనకుని బంధువర్గమును ♦ స్వాంతములోఁ బలుమారు నేస్మరిం
చి నయవిపశ్చిదగ్రణుల చిత్తమునన్భ ♦ జియించి తొల్లి యా
వినికననట్టి గ్రంథమును ♦ బ్రీతితో వ్రాయఁగబూనినాఁడ యో
పినవరకీ ప్రయత్నమును ♦ పెంపొనరింతురు గాక పండితుల్.

పెన్నజూటూరు.
26-3-1935

ఇట్లు విద్వజ్జనవిధేయుడు,
జె. రంగస్వామిరెడ్డి.

# తండ్రి కొడుకు సంవాదము

కొడుకు—నాన్నగారూ! ప్రపంచమున నెన్నో నవలలు బయలుదేరి యున్నవి, గాని వానియం దొక్కటియైనను నీతిబోధకముగ నుండుట లేదు. ఇపుడు నూతనముగ నొక బాలకవి యనేకనీతివిషయముల జేర్చి మృదుమధురమగుభాషతో నొక నవలారత్నమును లిఖించి యున్నవాడు. నే నా పొత్తమును నిన్నటి దినము తాడిపత్రిలో నా మిత్రుల యొద్ద చూచితిని.

తండ్రి—పుస్తకము పేరేమి?

కొడుకు—విష కేసరి.

తండ్రి—ఈ కావ్యము నత్యుత్సాహమున రచించిన విచక్షణుని నామధేయ మేమి?

కొడుకు—చెప్పెద నాలింపుము.

మ॥ దివిజానీకము మేలుమేలనగ దీ ♦ ప్తిన్వన్నజూటూరి మా
ధవుడా కేశవమూర్తి సత్కరుణచే ♦ ధాత్రిస్థలి న్ననృతిణ
కవితాలంకృత గాత్రుడై వెలసి రం ♦ గస్వామి హర్షంబుతో
నవలాగ్రంథము వ్రాసికీర్తిగనె విన్నాణంబుమేపారగ

జనకా! అతడింక నెట్టి మహనీయుడన,

తే॥గీ॥ సకలగుణఖని ధ్యానంబు ♦ సలుపువాడు
దాశరథి యని సతతంబు ♦ దలచువాడు
ఇతరవనితల తల్లులం ♦ చెన్నువాడు
సుంకమాంబకు ముద్దుల ♦ సుతుడు తండ్రి.

మరియు

సీ॥ ఫలవృక్షములతోడ ♦ ప్రసరించి విలసిల్లు
పెన్నజూటూరులో ♦ నున్నవాడు
పతికెదురాడక ♦ పతిసేవలొనరించు
సతిశ్రీమెరుకలాంబ ♦ సుతుని సుతుడు
రమణీయ మూర్తియా ♦ రాఘవరెడ్డికి
సహజన్ముడాతడు ♦ సరసగుణుడు
కడుయశోమూర్తిస ♦ త్కవినృసింహ్మారెడ్డి
ప్రియతరశిష్యుడై ♦ వెలయువాడు

వ॥ తండ్రీ ఇక నీ త ని సద్గుణాదులు వినిపించెద యా
లకింపుము.

తే॥గీ॥ స్వప్నమందును హరియని ♦ వదరుచుండు
తల్లిపదములగొల్చుసం ♦ తతమునతడు
ఇట్టిగుణములుగల్గియు ♦ నిలతలమున
నొప్పచున్నాడుకవిపుంగ ♦ వుండు జనక.

తండ్రి—తనూజా, నీప్రార్థిచేత రసికుని విషయమం తయు సంసిద్ధిగ నేనడుగకమునుపే సవిస్తరంబుగ నా కెరుకప రచి నన్నానందాబ్ధియందు ముంచితివి. పారబడితిని; కృతి కర్త శ్రీమనోనాథుని భక్తునివలె గనుపట్టుచున్నాడు.

కొడుకు—అవును తండ్రీ.

తండ్రి—తనూభవా, గ్రంథమునం దేమేమి నీతివిష యంబులున్నవో నాపాపి కర్ణంబులకు వినిపింపుము.

కొడుకు— జనకా, చదివెద; శ్రద్ధామనస్కుండవై నాపలుకుల వినుము.



# దైవప్రార్థన

—o—

కం॥ శ్రీ లక్ష్మీపతి సురవర
కీలాలజ పత్రనేత్ర ♦ గిరిధర శౌరీ
నీలఘనకాయ భూషిత
వ్యాళాధిపశయన దేవ ♦ వార్ధిగభీరా.

ద్విపద.

శ్రీ రత్నగర్భేశ ♦ శ్రితజనస్తోత్ర
శ్రీరామచంద్ర దా ♦ క్షీరాబ్ధిచంద్ర
నాదు గ్రంథంబును ♦ నయముగా బ్రోచి
మేదిని పెక్కేండ్లు ♦ మెరయంగ నిలుపు.

—o—



# విషకేసరి.



## —♦ గ్రంథకర్తృవంశావతారము. ♦—

### సీసమాలిక.

శ్రీకరగుణాఢ్యుండు ♦ శ్రీపెన్నజూటూరి
పురనివాసుండు స ♦ ద్బుధనుతుండు
పాకనాటికులాబ్ధి ♦ రాకాసుధాంశుండు
ఇనుమద్దిగోత్రాబ్జ ♦ దినకరుండు
చిన్నసుబ్బారెడ్డి ♦ శ్రీమెరుకలాంబను
తనకు దేవేరిగ ♦ ధరణి బడసె
నమ్మహాసాధ్వియు ♦ సమ్మోదము దలిర్ప
ముద్దులొల్కెడి నిరు ♦ మువురసుతుల
నింతులమేల్బంతు ♦ లిరువుర బిడ్డల

గని మహావిఖ్యాతి ♦ గాంచె, నందు
నీతికోవిదు డగ్రి ♦ జాతుండు చిన్ననా
రాయణారెడ్డి ధు ♦ రంధరుండు;
నందు ద్వితీయుఁడై ♦ సలరెడు బాలనా
రాయణరెడ్డి మ ♦ హాయశుండు,
మూడవ కొమరుండు ♦ మురవైరిభక్తుండు,
వీరరంగారెడ్డి ♦ వినయమతుఁడు
తులితాబ్జముఖు చ ♦ తుర్థపుత్రుఁడు సు
శ్లోకవిజ్ఞానుఁడు ♦ సుంకిరెడ్డి;
పంచమగర్భ సం ♦ భవ, పూతచారిత్రి
రామసుబ్బమ్మయు ♦ రాజవదన;
పృథులవిఖ్యాతుండు ♦ పెద్దసుబ్బారెడ్డి
రవికోటిదీప్తు డా ♦ రవసుతుండు,
సప్తమసూనుఁడు ♦ సార్థకనాముండు
బాలసుబ్బారెడ్డి ♦ భవ్యయశుఁడు,
శిష్టమతల్లి యా ♦ శ్రితకల్పవల్లి బా
లాంబనా బఱగెను ♦ యష్టమసుత,
తే॥ గీ॥ వీరలందరు వంశము వృద్ధిసలిపి
సొబగుమించిరి; యందులో ♦ సుంకిరెడ్డి
సుంకమాంబామతల్లి వి ♦ శుద్ధచరిత
బరిణయంబాడి ధరయందు ♦ ప్రబలుచుండె.

సీ॥ ఆమానినీమణి ♦ ప్రేమతో మము గాంచె
కమలాకటాక్ష వీ ♦ క్షణము గల్గి
అందగ్రిజామణి ♦ యతివలమేల్బంతి
రాకాబ్జవదన శ్రీ ♦ రంగమాంబ;
క్షీరాంబుధివిహారు ♦ సేవావినోదుండు
రాఘవరెడ్డి సా ♦ రభ్యమూర్తి;
సాధుజనస్నేహ ♦ సతతమనోహర
ప్రియుడు రంగస్వామి ♦ రెడ్డిఘనుడు
తే॥ గీ॥ తల్లిదండ్రులశుభముల ♦ దలచువాడు
జగతి స్వామిరంగారెడ్డి ♦ సౌమ్యవరుడు
దివ్యసౌదామినీతుల్య ♦ దేహయుతుడు
రెడ్డికులమణి మాధవ ♦ రెడ్డియొప్పు.
కం॥ సూరిజనోత్తములారా
ధారుణి యాసుంకిరెడ్డి ♦ తనయులలోనన్
ధీరుడు మూడవవాడన
శ్రీరంగస్వామిరెడ్డి ♦ చెలువు వహించెన్.
వ॥ ఇట్టి నేను.
తే॥ గీ॥ ప్రాభవంబున నవలాప్ర ♦ బంధమొకటి
జెప్పబూనితి, మత్కృతి ♦ దప్పులున్న
దిద్ది సవరణ జేయుడీ ♦ పెద్దలార
సంతత మొనర్తు నే నమ ♦ స్కారములను.

—♦ మాతకు వందనములు. ♦—

తే॥ గీ॥ పతియె దైవం బటంచును ♦ ప్రతిదినంబు
భర్తసేవ లొనర్చిన ♦ పరమసాధ్వి
సుంకమాంబకు ననుగన్న ♦ సుగుణమణికి
భక్తి నొనరింతు పదివేల ♦ వందనములు. 5

—♦ అగ్రజునికి వందనములు. ♦—

తే॥ గీ॥ బీదసాదలజూచిన ♦ ప్రియముతోడ
దానధర్మంబు జేసిన ♦ ధార్మికుండు
నెవ్వ రేమన్న నెదురాడ ♦ డెన్నడట్టి
నాదు నగ్రజునకు వంద ♦ నము లొనర్తు. 6

—♦ గురువునకు వందనములు. ♦—

తే॥ గీ॥ కవికళానిధిబిరుదును ♦ గాంచినాడు
పండితుడనంచు గర్వంబు ♦ పడనివాడు
వసుధ సావిత్రి శశిరేఖ ♦ వ్రాసినట్టి
నరిసిరెడ్డికి నే వంద ♦ నములొనర్తు. 7

—♦ పితామహునకు వందనములు. ♦—

తే॥ గీ॥ నిరుపమామోదహృదయ సం ♦ భరిత, సదయ,
పరహితోదారవర్య, కృ ♦ పాసముద్ర,

పద్మకాంతుల దెగడునీ ♦ పాదములకు
దండములు సల్పుచున్నాడ ♦ తండ్రితండ్రి. 8

—♦ జ్యేష్ఠమాతకు నమస్కారములు. ♦—

సీ॥ అత్తమామలయెడ ♦ యణకువతో మెల్గి
మన్ననలంబొంది ♦ మాన్యయయ్యె;
భర్తయూడిగముల ♦ భయభక్తులతో సల్పి
సతులను నిర్జించు ♦ సాధ్వియయ్యె;
పరమర్త్యులే తెంచ ♦ పక్కకుతొలగియు
వారిచేత నెపేరు ♦ వడసి వెలసె;
నన్నపానాదుల ♦ యాచించు నరులకు
బింక మించుక లేక ♦ పెట్టదొడగె
తే॥ గీ॥ కామమాదిగ షడరివ ♦ ర్గముజయించి
సతతదేవాంఘ్రి పూజాను ♦ మతి చరించె
పరగ సుబ్బమ్మయను పేఱ ♦ బఱగెనట్టి
నాదు పెదతల్లి కెప్పుడు ♦ నతులొనర్తు. 9

—♦ ప్రి స వి త్రి స్తు తి. ♦—

సీ॥ తొమ్మిదిమాసముల్ ♦ తోషణతో నన్ను
తన జఠరంబున ♦ దాచుకొనియు
కాల్నడకలతో నా ♦ గర్భముఃా మోయుచు

క్షోణిజనుల్ మెచ్చ ♦ కుక్షిబెంచి
ప్రేమింపజాలని ♦ భీకరకష్టముల్
రేయిబవళ్లు భ ♦ రించుచుండి
పదియవమాసంబు ♦ పడినంత ప్రసవించి
యేడ్వగ చనుబాల ♦ నిచ్చుచుండి
తే॥ గీ॥ యిటుల వివిధ చందంబుల ♦ నిరుగు పొరుగు
వారు కొనియాడ నను బెంచి ♦ వాసికెక్క
వేయి సూర్యులమాదిరి ♦ వెల్గుచున్న
సుంకమాంబను సర్వాంబ ♦ సుభగసుతను
ప్రకటితంబగు భక్తితో ♦ బ్రస్తుతింతు. 10

—♦ నను కన్న జనకుని స్తుతి. ♦—

మ॥ కులసందీప్తుని సత్యభాషణుని సాం ♦ గోపాంగవి
ద్యాంసునిన్
బలధీయుక్తుని నిర్మలాంతరుని పు ♦ ష్పాస్త్రప్రభా
భాసునిన్
భళిరే! నాదు పితామహుండు చినసు ♦ బ్బారెడ్డి
భూపాలునిన్
కలకాలంబు దలంతు నాదుకృతికిన్ ♦ కల్యాణముల్
గూర్పగన్ 11

—♦ నా పినతండ్రిస్తుతి. ♦—

సీ॥ నాపదమూడేట ♦ నను బాసిసద్గతి
నాతండ్రిగనియెను, ♦ నాటనుండి
యత్యంతప్రేమ న ♦ న్నాదరించియు చాల
మన్ననసల్పి పరి♦ సన్నమతిని
నామంకు బోగొట్టి ♦నను గుణాఢ్యుని జేసి
కన్నపుత్రుని రీతి ♦ ఘనత బెంచి
పెద్దవాని నొనర్చి ♦ పెక్కెంపు సత్కీర్తి
పుడమిలో బొందిన ♦ పుణ్యహృదయు
తే॥ గీ॥ డైన సౌశీల్యసీతాంబ ♦ హార్దవరుని
నాదు పినతండ్రి సన్మాన ♦ మోదఘనుని
జగతి పెద్దసుబ్బారెడ్డి ♦ క్షమనిధాని
నిత్యభయభక్తులు వహించి ♦ నే భజింతు. 12

గీ॥ విజయునకు శౌరి గీతను ♦ విసుగుపడక
శ్రద్ధతో హితబోధను ♦ సల్పినటుల
తనకు దెలిసిన విద్యలు ♦ దారబోసి
నన్ను వన్నెకు దెచ్చిన ♦ నవ్యగుణుడు
వైద్యనిపుణుడు శితకంఠ ♦ భక్తిపరుడు
నైన నారాయణప్పను ♦ నభినుతించి
తిరుగ చెలికాండ్రి సందర్శ ♦ దినము గొల్తు. 13

వ॥ శయనగృహమందు మృదువగు పాన్పుమీద బవ్వళించి కలలోనిట్లు దలపోయుచుంటిని.

సీ॥ శ్రీ రామచంద్రుని ♦ సేవింతునేగాని
వేరెదైవమును సే ♦ వింపజాల
'యసురాంతకా' యని ♦ యరచదనేగాని
యన్యశబ్దము నోట ♦ ననగజాల
మురవిదారునకు నే ♦ మ్రొక్కెదనే గాని
మూర్ఖమానవులకు ♦ మ్రొక్కజాల
వరరామమంత్రంబు ♦ బఠియింతునేగాని
యితరమంత్రము బఠి ♦ యింపజాల
తే॥ గీ॥ రిత్తసంసారమును విస ♦ ర్జింతుగాని
శ్రీశు భజనంబు నే విస ♦ ర్జింపజాల
అన్నపానీయములులేక ♦ నున్ననుందు
కాని లోకేశుదలుపును ♦ మానజాల 14

వ॥ అంతలోపలనే దిగ్గునలేచి యీాపగిది తలపోయసాగితిని. "అయ్యో, నేనెంత యజ్ఞానమునబడితిని. మధుర సంబులుగ్రోలుచు పట్టువస్త్రములు గట్టుచు, దూదిపాన్పులమీాద శయనించుచు, నాకంటె నధికుండులేడని విఱ్ఱవీగుచు సాగరముతో సమానమగు నీ సంసారంబునబడి శ్రీ రామనామస్మరణంబు చేయుచున్నానుగదా! ఛీ

నాయట్టిపాపాత్ముడు త్రిలోకములందును లేడు. కటకటా! పొరబడితిని. నిద్రయందేమియో కలగనినటుల దోచుచున్నది. ( కొలదిసేపాలోచన నభినయించి ) ఆ! తెలిసెను. "శ్రీ విజయరాఘవునితప్ప నితరుల గొల్వజాల" నని. సహస్రాక్షు లేల? శ్రీరామభద్రుడే నా రక్షకుండని స్వప్నముగంటిని. మా రఘురాముని స్వాంతమందు స్మరించితినిగాన నామనంబిప్పుడు ప్రమోదమయ్యెను. ఈ కలగనినప్పటినుండి మా సీతాపతి దివ్యమంగళ విగ్రహము పరికించవలెనని నాకభిలాషకలిగినది. కనుక, యీ శైశవప్రాయంబుననే పాపరూపంబగు నీ సంసారంబును పారద్రోలి, తాపసవేషము వహించి, మహారణ్యంబునకరిగి ఆకులలముల భక్షించుచు పంక్తిముఖాంతకునిగూర్చి ఘోర తపంబొనరించి, యా నీలనీరదగాత్రుని సుందరాకృతి నరసి వచ్చెదగాక." అని తపోవన ప్రాంతంబునకేగి అటద్రిమ్మరుచు నీవిధముగా శ్రీ రామనామస్మరణంబు జేయుచుంటిని.

—♦ వరప్రాప్తి. ♦—

సీ॥ శ్రీరంగలక్ష్మీశ ♦ శ్రీహృషీకేశ, య
యోధ్యాపురాధీశ, ♦ యుర్వీనాథ,
బ్రహ్మాండనాయక, ♦ బలభద్రసోదర,
వేదాంతవేద్య, శ్రీ ♦ విష్ణుదేవ,

దైతేయమర్దన, ♦ దశరథనృపపుత్ర,
సురరక్షగోవింద, ♦ సూర్యతేజ,
గజరిపుగంభీర, ♦ కరిరాజరక్షక,
మాధవహరి, శౌరి, ♦ మంజుభాష,
తే॥ గీ॥ కంసశిశుపాలహంతక, ♦ కామజనక,
వేంకటేశ్వర, ♦ సురసంఘవినుతిపాత్ర,
పుండరీకాక్ష, దశరూప, ♦ పురుషరత్న,
గరుడవాహన, శ్రీధర, ♦ కంబుకంఠ. 15

సీ॥ శ్రుత్యంతసంచార, ♦ సుందరశారీర
పీతాంబరాంచిత ♦ ప్రేమమూర్తి
సర్వజ్ఞ, సర్వాత్మ ♦ శౌరి రమానాథ
సార్వభౌమేశ్వర ♦ సాక్షిభూత
మంథాద్రిధర ♦ భక్తమందార దేవేశ
సరసీరుహాక్ష ♦ విశాలవక్ష
మణిరాజసన్నిభ ♦ మౌళిమస్తకధార
యఖిలలోకాధార ♦ యమలచిత్త
తే॥ గీ॥ సర్వసమభావ శార్ఙ్గహ ♦ స్త, ప్రశాంత,
దృప్తఖరదూషణాటవీ ♦ దీపనోగ్ర
పూజ్యవర పెన్నజూటూరి ♦ పురనివాస
రఘుకులోద్ధార జగదభి ♦ రామచంద్ర. 16

సీ॥ ఉపశమసుహితాత్మ ♦ తపనీయభాసుర
కలశాబ్ధిశయన, లం ♦ కాప్రణాశ
దుర్వారవిక్రమ ♦ దుర్జయాధీశ్వర
సజ్జనస్తవనీయ ♦ సచ్చరిత్ర
శ్యామవర్ణశరీర ♦ కామితార్థప్రద
లక్ష్మీనిరంజన ♦ రాజవదన
కుందకుట్మలదంత ♦ సుందరతరభుజ
యసమానవనమాల ♦ హార, యాశ
గీ॥ వాలిసంహార ధర్మిష్ఠ ♦ వైభవేశ
పంకరుహసాభనయన పా ♦ వనపదాంక
ఖగకులాధిపగమన స ♦ త్కార్యరమణ
పూజ్యవర చిన్నజూటూరి ♦ పురనివాస
రఘుకులోద్ధార జగదభి ♦ రామచంద్ర. 17

(శోకముతో) నే నీ సాంద్రాటవీప్రాంతము బ్రవేశించి రెండు దినములైనది. రెండురోజులనుండియు శ్రీరామకీర్తనలతో నీ యరణ్యంబంతయు పరిశోధించినను తపంబాచరించుటకు తగుమైనవసతి యెందును దొరకలేదు. (ఒకదెసపరికించి) ఆహా! నాభాగధేయమేమని కొనియాడుదును. ఇక్కడి కరక్రోసుదూరమున సలలితారామము నా కన్నులకు గనుపట్టుచున్నది. ఆరమ్యస్థలంబు తపంబాచరించుట

కు మిక్కిలి యనుకూలముగా నుండుటచే జానకీచిత్తచోరు
నీ విధంబుగా వర్ణనగావించుచు నవ్వానంబునకు బయనమ
య్యెదగాక.

తే॥ గీ॥ సీమదమ్ముపైన నిలచను ♦ జెందినావు
పాంచజన్యము కరమున ♦ బట్టినావు
పునుగుమృగనాభి తనువున ♦ బూసినావు
సిరికి నాథుండవై విల ♦ సిల్లినావు. 18

అంతలోపలనే వనములోనికిబోయి యొకవటవృక్షము
క్రింద గూర్చొని నిష్కల్మషమనస్కుండనై యీ ప్రకా
రంబుగా స్తోత్రం బారంభించితిని.

సీ॥ తోయజహితవంశ ♦ దుగ్ధసింధుశయాన
శోభిల్లు నీరూపు ♦ చూపరాద
భక్తవత్సల దేవ ♦ భవ్యలోకజానాథ
శోభిల్లు నీరూపు ♦ జూపరాద
భూమిజామాత శ్రీ ♦ భూసురోత్తమమిత్ర
శోభిల్లు నీరూపు ♦ జూపరాద
నవనీతచోరుడ ♦ నాగేంద్రఫణనృత్య
శోభిల్లు నీరూపు ♦ జూపరాద

తే॥ గీ॥ కమలలోచన, నగధర ♦ కలుషహరణ
చపలమోహన, జయశీల ♦ చక్రహస్త

రుచిరముగనున్న నీమహా ♦ రూపుజూపి
మదిని నున్నట్టి చింతను ♦ మాన్పరాద. 19

( మతిలో ) శేషశయనుండగు విష్వక్సేను నెంత సన్నుతించినను తన దివ్యమంగళస్వరూప మీ సరికిని కనుబరపకున్నాడు. హా కౌసల్యాగర్భవార్థి రాకాశశాంక! దాసుని మొరలు మరచుట పాడియా? భక్తుని దుఃఖము నణచి మనసు శాంతింపజేయుము. ( అనికొలదిసేపూరకుండి తిరుగ నీలాగున జపమును ప్రారంభింప దొడగెను. )

ద్విపద.

కైరవలోచన ♦ కౌస్తుభవక్ష
నీరజపరివృఢ ♦ నీలశరీర
ఆహితలక్షణ ♦ నక్షోధనపతి
మోహనాంగవర నా ♦ మునుకువదీర్చు. 20

సీ॥ సకలలోకాతీత ♦ సద్గుణసంఘాత
సొంపారు నీరూపు ♦ చూపరావ
బహురూపవర్తన ♦ భక్తసంరక్షణ
సొంపారు నీరూపు ♦ చూపరావ
కర్మకృమాజైత్రి ♦ కామోదకీహస్త
సొంపారు నీరూపు ♦ చూపరావ

బ్రిహ్మర్షిసవరక్ష ♦ పంక్తిరథాత్మజ
సొంపారు నీరూపు ♦ చూపరాద

తే॥ గీ॥ గట్టుతాలుప దేవర్షి ♦ గానలోల
వననిధివిభంగ రవికుల ♦ వార్ధిచంద్రి
ధాత్రిధవ తాపసస్తోత్రి ♦ దామ రామ
శోభనంబగు నీరూపు ♦ చూపరాద. 21

శా॥ శ్రీకాళీస్తుత విశ్వసంభరిత శ్రీ ♦ సీతామనోనాయకా
కాకుత్స్థాన్వయ సత్ప్రదీపక సతీ♦కౌసల్య భద్రాత్మజా
లోకజ్ఞాధిప లోకమోహన కళా♦లోకేశ వేద్యాగ్ర నీ
యాకారంబును జూపి నాదుమదికిన్ ♦ హర్షంబు జే
కూర్పుమా

సీ॥ పరివిమల గుణసాంద్ర ♦ భవబంధమోచన
పరకాంతవిముఖ స ♦ ద్భక్తపోష
విపినశైలవిహార ♦ విగతదోషాధీశ
దుష్టవిఖండన ♦ దురితదూర
వివిధశోభిత భూష ♦ వితతసచ్చారిత్ర
ధరణీకళత్ర సం ♦ తతపవిత్ర
శితికంఠసన్నుత ♦ శ్రితపారిజాత సూ
ర్యాబ్జలోచన దేవ ♦ యార్తబంధు

తే॥ గీ॥ తావకీనమనోజ్ఞ ♦ వదనముజూడ

వేచియున్నాఁడ ♦ దీనుఁడ ప్రీతిమీర
కనికరమునుంచి నామీద ♦ కన్నునుంచి
దర్శనమొసంగి బ్రోవు కో ♦ దండరామ. 22

ఓ వేదాంతవేద్యా! నాకోర్కెల నెరవేర్పజాలవా? నెర వేర్పనియెడల యీ ఖాతిచే నాశిరస్సును రెండువ్రక్కలుగా వించి జీవము విడిచెదను. (అని ఖాతిచే తలను పగుల గొట్టుకొను సమయంబున)

శ్రీరాము:—(ఆతురతతో) భక్తాగ్రేసరా! శాంతింపుము. శాంతింపుము. నీకోర్కెల దీర్చెదను. (అని నా కనులకు గనుపట్టును.)

(లేచి) హస్తములు జోడించుకొని

(హృష్టమానసముతో) హేపరాత్పరా మహామునీశ్వరులు వేనకు వేలు హాయనములు తపంబాచరించినను సాక్షాత్కరింపని మహా మహుండవు నాబోటి పరమనీచునికి నీ సురుచి రాకారము జూపితివిగదా.

శ్రీరాము:— సుగుణ గరిష్ఠా, నీ నిశ్చలంబగు భక్తికి, నీ వొనర్చిన తపంబునకును నానందించితిని. నీ వేమికోరికలు బడయుటకై యింత యద్భుత తపంబొనరించితివో యట్టివరంబులడుగుము. అభ్యంతరములేక నొసంగుదును.

పతితపావనా! నీప్రసన్నవదనము దర్శించుటకై తపంబొనరించితిని గాని వరములు బడయుటకుకాదు. నీవు నీయి

చ్చవచ్చిన వరముల కోనుమని కరుణాసముద్రుడవై వాక్రు
చ్చుచున్నావు. కావున నీ పలుకు పగిది నాకిట్టి యొక్క వరము
ప్రసాదించుము.

తే॥ గీ॥ సిరియుగావలెనని చింత ♦ సేయలేదు
భార్యగావలెనని మది ♦ వాంఛలేదు
బలముగావలెనని భ్రమ ♦ పడగలేదు
దేవ, మీ సేవకొరకు చిం ♦ తించువాడ. 23

(అని భగవంతుని పాదాబ్జములపై వ్రాలుదును.)

శ్రీరాము:— (లేవనెత్తి) దాసపుంగవా, నీవుకొన్నిదిన
ము లీ వసుధమీద వర్ధిల్లి యటుతరువాత నా వైకుంఠ స
న్నిధిజేరగలవు. ఆ తక్షణమే నీ విపుడుదలచిన ప్రియమైన
కోరిక చెల్లించగలను. కనుక చిత్తమున నేలాటివగపు
నుంచుకొనక నీ నిజభవనంబునకు మరలుమనిచెప్పి తిరోహి
తుడగును.

వేదమోదితా! నీ యానతి శిరసావహించితిని (అని శ్రీ
రామకీర్తనలు పాడుచు నాడుచు నతిసంతసమున నానికేత
నంబున కేతెంచి యనుదినంబును శ్రీరామ భజనతో ప్రొద్దు
పుచ్చుచుంటిని.)

చదువరీ, యీచిన్ని నాటకరాజము ముగిసెను



# విషకేసరి.



## పీఠిక.

### —♦ ఇష్టదేవతా ప్రార్థనము. ♦—

తే॥గీ॥ శ్రీకళత్రుఁడు విబుధ సం ♦ సేవితుండు
విశ్వరూపుండు సకలలో ♦ కేశ్వరుండు
విమల నీరద సంకాశ ♦ విగ్రహుండు
మము కృపారసదృష్టిచే ♦ మనుచుఁగాత. 1

### —♦ శ్రీశారదాంబాస్తుతి. ♦—

తే॥గీ॥ వల్లకీపాణి వాగీశ ♦ ప్రణయదేవి
వర్ణరూపిణి; శిఖియాన ♦ భాసురాంగి,
విబుధరసనావిహారిణి ♦ విలసితాంగి
వలయువాక్కుల నొసగు ♦ విశ్వాసముగను. 2

## —♦ భార్గవీ స్తుతి. ♦—

ఆ॥ వె. లోకజననివమ్మ ♦ లోకనాయకివమ్మ
శరధిజన్మ వమ్మ ♦ శార్ఙ్గిసతివి
మాకు సిరులనిచ్చి ♦ మమ్మునుబోషించి
కష్టమెపుడులేక ♦ కావుమమ్మ. 3

## —♦ పశుపతి స్తుతి. ♦—

తే॥గీ॥ భద్రవాహన క్రతుజైత్ర ♦ ఫాలనేత్ర
యక్షవరమిత్ర భూతేశ ♦ యష్టమూర్తి
కాలకంఠాగ్రిఖద్గూర ♦ శైలవాస
మాకు శుభము లొసంగియు ♦ మనుపు మయ్య. 4

## —♦ పార్వతీస్తుతి. ♦—

కం॥ హిమగోత్రాత్మజశంకరి
యుమ, విధుసంకాశవదన ♦ యుత్తమగౌరీ
ప్రమథగణభర్తృజననీ
మము నుపలక్షించి యేలు ♦ మక్కువతోడన్ 5

## —♦ పరమేష్ఠిస్తుతి. ♦—

ఉ॥ ప్రాకటవిఘ్నశేఖర య ♦ పారప్రశస్త విధాత కంజగ
ర్భాకలహంసయానసక ♦ లాగమసంభవ భారతీశ, ధా
తా కమలాంతరప్రభవ♦తత్త్వసురూపచతుర్ముఖాంచితా

మాకు జిరాయువిచ్చియుస♦మానకృపఁ బరపించుమె
ప్పుడుఁ 6

—♦ హనాయకుని స్తుతి. ♦—

కం॥ నిరుపమభక్తితొ మ్రొక్కెద
కరివదనుని విఘ్నపతిని ♦ కడువామనునిఁ
గిరిజామనోజ్ఞ పుత్రుని
గరికాంకుని సారగుణుని ♦ గణపతిదేవుఁ. 7

నేనొకానొకదినము మాగ్రామమందున్న శ్రీవీరాంజ
నేయునిగుడికేఁగిపలికిజని యా యంజనాదేవి
సుపుత్రునిట్లు శ్లాఘింప దొడంగితిని.

సీ॥ లవణాబ్ధి బిల్లకా ♦ లువ రీతి లంఘించి
త్రుటిలోన వైరుల ♦ దున్మించినావు
శ్రీరామముద్రికఁ ♦ క్షితిజాతకొసగి యా
పరమసాధ్విని ♦ ప్రీతిబరచినావు
దశకంఠుముందర ♦ ధైర్య మంతయు జూపి
బలపరాక్రమములు ♦ బడసినావు
దోఃప్రతాపంబున ♦ ద్రోణాద్రి గొనివచ్చి
దివిరి లక్ష్మణుమూర్ఛ ♦ దెలిపినావు
తే॥గీ॥ మారుతాత్మజ ఖగపతి ♦ మదవినాశ

జానకీనాథ భక్తమో ♦ దానుకర్త
పెన్నజూటూరిపరిపాల ♦ వినుతశీల
భంజితాసుర ధారేయ ♦ యాంజనేయ. ౮

కం॥ తరణికుమారామాత్యా
పరిపూర్ణజ్ఞానవీర ♦ వానరనాథా
గిరిసదృశదేహ హనుమా
పరులనురంజింపచేయు ♦ వాక్కులనిమ్మా. ౯

పెన్నజూటూరునకు నైఋతిదిగ్భాగమున
నున్న వజ్రగిరి నరసిహ్మునిస్తుతి.

సీ॥ కోటిసూర్యులకాంతి ♦ ఓటునురానిది
వైకుంఠవాసము ♦ వదలినావు
పీతాంబరంబులు ♦ ప్రేమతో ధరియించి
కళలేని గుడ్డల ♦ గట్టినావు
ఆదిశేషునిమీద ♦ ననుదినంబును బండి
శిలగుడిలోపల ♦ నిలిచినావు
మబ్బు వెల్తురుజేయు ♦ మణిభూషలను వీడి
తామ్రభూషణముల ♦ దాల్చినావు
తే॥గీ॥ కులరమణితోడ మంజుల ♦ కూటమందు
కాపురంబును జేయు రౌూ ♦ కమలనాభ
ముక్తిపద మిచ్చి నను గావు ♦ భక్తవరద

దానవాంతక వజ్రగి ♦ రీనృసింహా. 10

—♦ కవులస్తుతి. ♦—

ఉ॥ యోజనగంధినందనుడ ♦ యుబ్బొనరించు కవిత్వధీరసం
పూజితపాదపద్మ బుధ ♦ పుంగవభాగవతాంశ
పూర్ణ, ని
ర్వ్యాజకృపాసముద్ర, వర ♦ భాగవతేశ్వర, యోగనేత్ర కృ
ష్ణాజినతల్ప నీదు స్మరణంబును నిత్యము సల్పుచుండె
దన్. 41

—♦ ద్విపద. ♦—

అతులితానుక్రోశు ♦ నభి రామహృదయు
నతజనబుధసంఘు ♦ నవ్యప్రవీణు
సహజపండితభావ ♦ సంభావ్యగాత్రు
విహితశ్రీలక్కాంబ ♦ విమలసత్పుత్రు
భువిదేవ బమ్మెర ♦ పోతనామాత్యు
సవినయంబున మన ♦ సార గొల్చెదను. 42

—♦ అష్టపదకందము. ♦—

వీనుల కింపగు గద్యతో
పానకముఁ బోలునట్టి ♦ పద్యంబులతోఁ
శ్రీనగధరు చరితంబుల

భూనరులరుదందసల్పి ♦ ముదము దలిర్పఁ
భానుని పోలిక నేటికి
నానాలోకముల వెల్గు నైష్ఠికబుద్ధిఁ
శ్రీనాధు భావమఱదిని
నానందముతోడ సతము నారాధింతుఁ 43

తే॥గీ॥ ధరణి పంచమవేదమై ♦ బరగునట్టి
భారతంబును సూర్యశు ♦ భ్రాంశులుండు
వరకు కల్పించి సాయుజ్య ♦ పదవి జెంది
ప్రచురితంబగుకీర్తిని ♦ బడసివెల్గు
నన్నయామాత్యతిక్కను ♦ ల న్నుతించి
నితరులౌయాంధ్రప్రాజ్ఞుల ♦ నుతియొనర్తు 44

వ॥ అని ముల్లోకజనంబు లాశ్చర్యము జెందునటుల న మితానందమున కొన్ని కైవారంబులు జరిపి, విద్యాభిమానులకు మూర్ఖులకు సూచనలు దెలిపి, నిజజనకునికి కృతిని సమర్పించి గ్రంథరాజము భువనమందు శాశ్వతంబుగ ప్రకాశింపజేయుమని శ్రీ రామచంద్రుని మనసార భూషించి, మద్వంశక్రమంబు లోకంబునకు వెల్లడిజేసి, జననిమొదలగు వారికి వందనములు సముచితంబుగ గావించి పునర్జన్మంబు లేకుండ జేసుకొనుటకై యొక విచిత్రనాటకంబును బన్ని యభీష్టదేవతలభజించి పూర్వదోషజ్ఞుల నభినందించి యిప్పటి విద్వాంసుల గొనియాడి మత్పురివర్ణన కుపక్రమించెద.

సీ॥ గారుత్మతస్వర్ణ ♦ ద్వారబంధంబులు
గోమేధికాంచిత ♦ గోపురములు
వెలి రత్నవైడూర్య ♦ విపణిమార్గంబులు
నారికేళామ్రాది ♦ భూరుహములు
ఘనరత్నమణిహేమ ♦ ఘటితకుడ్యంబులు
చారుశృంగారప్రా ♦ కారతతులు
చంద్రికాంతవినీల ♦ సౌధరాజంబులు
మంజులనవరత్న ♦ మండపములు
గీ॥ నిఖిల దిశలను వెలిగించు ♦ నివసనములు
స్త్రీల పురుషుల మెప్పించు ♦ జీవనములు
కలిగి విలసిల్లు దివిజేంద్ర ♦ పురముమాఱ్కి-
వరలు శ్రీ పెన్నజూటూరి ♦ పురవరంబు. 45

—♦ కథా ప్రారంభము. ♦—

## మొదటిభాగము.

## మొదటి ప్రకరణము.

శ్రీ వధూమణిముఖసర ♦ సీరుహాప్త
శత్రుభీషణసంగ్రామ ♦ జయనివాస
సత్కృపామయభూషణ ♦ సన్నుతాంగ
రమ్యగుణధామ, నాపాలి ♦ రంగధామ.

అని యిట్లనేక గతుల గ్రంథకర్త తాను పూనినపని నిర్విఘ్నంబుగ పరిసమాప్తినొందుటకై శ్రీ రంగనాయకుని మనసారధ్యానించి యతి మనోహరంబగు కథనునిబ్బంగి యుపక్రమించుచున్నాడు.

శ్రీ మత్సకలైశ్వర్యసంపదలతో విరాజిల్లు యీ భరతఖండమునందు పశ్చిమదిగ్భాగమున తొలిపక్కము నాటిమృగాంకునిబోలె దేదీప్యమానముగా ప్రజ్వలించుచున్న బొంబాయిపట్టణము యెరుగనివారుండరు. ఆనగరమునందు ప్రసిద్ధికెక్కిన లక్ష్మీసంపన్నుడగు పుండరీకుడను విప్రోత్తముండుగలడు. అతనికి నలుబదివత్సరము లుండును. ఆ భూసత్తముని యంగసౌష్ఠవము శరీరచ్ఛాయయు వర్ణింప వాచస్పతికైనను వశముగాదు.

ఆ కమనీయ శుభ్రగాత్రుని భవనము స్ఫటికశిలలచేతను, ఇంద్రనీలగారుత్మతఖచిత మంజులస్తంభములతోడను, హాటకమణి హిరణ్యనవరత్నమౌక్తిక శిఖరాగ్రములచేతను, భర్మశుభ్రరత్నసాధుభిత్తిగవాక్షవేదికా గర్భాగారంబులును, పుష్యరాగమాణిక్య రాజితప్రభాదీపిత సాలాదులును, గలిగి యమరావతీ పురంబునంబోలె వెలయుచుండెను.

ఆ బ్రాహ్మణోత్తముడు విభవమందు “ నన్ను మించినవాడీ భూలోకమునందులేడను ” మదంబింతయుఁ లేక

నిటలాంబక ప్రకటచాప ప్రమర్దనునిభంగి సమస్తజనులను సమమైనదృష్టితో నవలోకించుచు సహస్రాంశుని పోల్కి మానుషుల స్తోత్రాధీశుడై ప్రకాశించుచుండెను. మఱియు

కం. విడువడు మిత్రులగాంచిన
నడువడు చెడుపనుల త్రోవ ♦ నానాగతులన్
ముడువడు పరవిత్తంబుల
నుడువడు వితథోక్తుల న్మ ♦ నోనిగ్రహుడున్. 17

అట్టిధర్మశీలుని సహధర్మిణి లోకాంతరగతురాలైయుండెను. అప్పుండరీకునకు శ్యామలయను నొకదుహితగలదు. ఆమెయేతనకెల్లవిధముల నాధారమనియెంచి యల్లారుముద్దుగ బోషించుకొనుచు నిప్పటి దుష్టులవలె గర్వోన్మత్తుడై సేవకులనుగాని దాస దాసీజనంబులనుగాని యుంచుకొనక నకొమరితతోడనే గృహకృత్యముల జరిపించుచుండెను.

ఆకిశోరికిప్పుడు పదునాఱేండ్లవయస్సు; నవయౌవన పూర్ణయై షోడశకళాపరిపూర్ణయై వెలుగుచుండెను. ఆ తరుణీశ్వరి కింకనుపరిణయము జరుగలేదు.

ఈమెకు చదువనిన నెంతయోయభిలాష. నిరతమన స్సూయ, దమయంతి, సావిత్రి, సీత, చంద్రమతి, యాదిగాగల సాధ్వుల గ్రంథరాజముల బఠించుచుండెడిది. మనశ్యామల తన సదనమున జదువడములేదు. ఆయంగనామణికి శృంగార వనం

బను నొకయుద్యానవనంబుగలను. అవ్వనముయొక్క కాంతి వర్ణింప తరముకాదుకాని నాసాధ్యమున్నంతవరకు వర్ణన గావించెద.

సీ॥ మాకందదధిగ్గల ♦ మందారఖర్జూర
భూర్జమోచాజంభ ♦ సర్జనిచుల
కేతకీభల్లాత ♦ కినటచంపక
పీతసాలకనింబ ♦ పిచులకరక
బిల్వకురంటక ♦ పీతనపిప్పల
నారికేళపలాశ ♦ నాగపనస
తాలతక్కోలత ♦ మాలకామ్రాతక
లకుచజయాదిసా ♦ లములుగల్గి
తే॥గీ॥ మల్లెసౌగంధికాది సు ♦ మములు గల్గి
చాషకీరపికాదిపి ♦ త్సములు గల్గి
వన్నెవన్నెలు గల పల్ల ♦ వములుగల్గి
వరలు సురపతి నందన ♦ వనమువోలె
పట్టపగలింటి పద్మినీ ♦ ప్రభునివోలె
ప్రబలుచున్నదిశృంగార ♦ వనముఘనము. 18

వెండియు
సవ్వనంబు పలువిధంబులగు వల్లీతామర కూపములచేతను క్లీతకము గ్రోలి ఝుంఝుమ్మని దిరుగాడు మధుమక్షికల

చేతను మరింత ధగధగాయమానంబుగ విరాజిల్లుచు ప్రజ ల నానందాబ్ధియందు ముంచుచుండెను.

అట్టి యాక్రీడనమునకు మన శ్యామల నిత్యము సాయం కాలమైదుగంటలకు జని యెనిమిదిగంటలకు శిబిరంబునకు వచ్చి నిజపితరునికి యోదనంబు బెట్టి తాను భోజన మా రగించి తన మిత్రమణియగు కమలకు తనతండ్రికి హరిభ క్తపరాయణుల కథలు వినిపించుచు పదిరెండుగంట లైనతో డనే నికేతన కవాటములు బంధించి యాసుయువారును బ వ్వళించుచుండిరి.

చదువరీ! శ్యామల గృహంబున చదువక వనంబుననే చదువుటకు యేమికారణమో యని నీమదిని సంకోచము జెందవచ్చును. నీ సందియము బాపెద.

గృహమున మిక్కుటములగు సంసారముల చిక్కు లుం డును. మన శ్యామల యీ కపటయోజనంజనము సంగతి తెలుసుకొని ప్రతిసాయంకాలము శృంగారవనంబున కేగి ప ఠించుచుండును.

ఒక్కనాడు మన ముద్దులశ్యామల పన్నీరుచే జలకమా డి గౌరవర్ణము గల సుచేలము గట్టి నిడుపైన శిరోజములు నున్నగదువ్వి చరణములకు వెండి గొలుసులును హా స్తములకు సువర్ణకంకణములును వీనులకు రవలకమ్మలు గ ళమునకు ముత్యాలహారమును, లలాటమునకు పాప్ద్రిశన బొ

డమెడి లోకబాంధవుని ధిక్కరించునేమో యనునట్టి కుంకుమ రేఖ బెట్టి నిగనిగలాడు నయనములకు కాటుకబూసి, తెల్లనిసిల్కు రవికె దొడిగి కుడిచేతియందు పుస్తకముబట్టుకొని శృంగారవనము జొచ్చి కంచుకమువిప్పివేసి చలువఱాయి మీాద బవ్వళించి దక్షిణకరమునందున్న పుస్తకమునుదీసుకొనియిట్లు చదువ దొడంగెను.

## —♦ దండకారణ్యము. ♦—

( శ్రీ రామచంద్రుడు తమ్మునితోడను, పత్నితోడను బ్రవేశించును. )

రాము:— దేవీ, వైదేహీ! నిన్నటిదినంబున మనకు భక్తితో పూజలొనరించి సాగనంపిన యనసూయాధిపుడు వినిపించిన భీకరారణ్యమిదియే సుమీా. ప్రాణనాయకీ! అటుదిలకింపుము. దుష్టజంతువులన్నియు బొబ్బరిల్లుచు తమతమ పొదలసన్నిధికెట్లు పరుగిడుచున్నవో; యీా ఘీంకారమునకు పాదపములమీాద సుఖనిద్రజెందుచున్న విహంగములన్నియు యంతరిక్షముపై కెట్లెగయుచున్నవో! ప్రియేశ్వరీ! ఇది దనుజులువసించుస్థలము. ఇట్టిచోటున మానవులు వసింపనేర్తురె?

గీ॥ మల్లెమొగ్గలు జూచిన ♦ మమతతోడ

కేశముల దాల్చినట్టి యా ♦ కీరవాణి
యట్టిపువ్వులమించిన ♦ వవిగొ చూడు
( యనుచు భూజాత కుడిచేతిని బట్టుకొని)
దెచ్చి నీమది రంజింప ♦ దేల్చువాడ. 19

అని శ్రీ రామభద్రుడు కుసుమములు కోసికొని వచ్చి గృహిణిచేతియందుంచగ నామె మాసుమనసముల సిగయందు ధరించును. ( మరికొంతతడువు నడచి )

రాము:— చాలు పేరింటిపూబోడీ, అటుచూడుము?

గీ॥ ఘోరభల్లూకశార్దూల ♦ కుంజరములు
కమలనారంజచూతవృ ♦ క్షావ్రజములు
కలకలారావసంకుల ♦ ఖగవితతులు
యవిగొ గనుపట్టుచున్నవి ♦ హరిణనేత్రి 20

సీత:— సుకుమారా! ఈ కాననంబుననున్న వింత విశేషములన్నియు నాకు విశదపరచితిరి. మనకు కొలది దూరమున మౌనుల యాశ్రమంబులు రెండు కనబడుచున్నవి. అవి యెవరి పర్ణశాలలో నాకెరింగించి మీ ప్రియురాలి వాంఛదీర్పుడు.

రాము:— (దరహాసముతో జనకసుతను కౌగిట జేర్చుకొని చెక్కిళ్లముద్దాడి) తరళాక్షీ! అది గౌతమబుష్యాశ్రమము. దానికి యావలనుండునదియే మన కులగురు

వగు వసిష్ఠాశ్రమము. మనము వానిని సవలోకించి మనజన్మంబుల సార్థకము జేసుకొనుటకు పోవుదము రమ్ము? లక్ష్మణా! మాయరాక్షసులు ద్రిమ్మరు వేళయయినది. ధనుర్బాణముల నెక్కుపెట్టి యతిజాగరూకుండవై మెలగుచు సత్వరముగా నడువుము.

లక్ష్మ:— సత్యవాక్పాలకా! నీ యాజ్ఞప్రకారమే, నటించెద. అటుచూడుము. నీవు ముందుకొనితెచ్చిన లతాంతములకంటే నా వృక్షంబున నతిమనోజ్ఞంబగు పుష్పములు కనుబడుచున్నవి.

రాము:— ఓహో! ఆ యగమునకా? (అని పుష్పములతట్టు పరికించుచు) అవును సుమిత్రాత్మజా, నేను తెచ్చియున్న ప్రసూనములకంటెమించి నీవు వచించినపుష్పరత్నంబులు మహీరుహంబునుగూడ పగటిల్ల జేయుచున్నవి. ఆ కుసుమంబులు కోసుకొనివచ్చి మీ వదినెకొసంగి మరింత సంతోషపఱచుము.

లక్ష్మ. గీ॥ చిద్విలాసక గుణగణాం ♦ చితవిశేష
శరధిశోషణ మునిజన ♦ స్తవవిహార
నీదు యాజ్ఞను తలదాల్చి ♦ నాదు పనిగ
మదిని దలచియు నరిగెద ♦ మందహాస 21

అని రయంబున జని నవమోహాన విరుల ఛేదించు

కొని వచ్చి యిలతనయ హస్తమందుంచ నా లావణ్య గాత్రి తనచతురమతిచే స్ఫుటసుమముల నొకదానికొకటి పెంచి యగణితానందంబున సత్కవులు మెచ్చునట్లు కంధరంబున దాల్చెను. ఇటుల సీతారామలక్ష్మణులా మహా గహనమధ్యంబున ముదంబున నడకసాగించుచు, మహాస్థల దర్శించి వారిచే సత్కారములందుచు బోవుచుండిరి. కొంతతడవు జనిన తోడనే శ్రీ రాఘవేంద్రునితో సీతాదేవి యిట్లుపలికెను.

సీత: సకలకళావిశారదా! ఈ కాంతారమును చూచుటకే భీతిని గలుగజేయుచుండ నిందు కాపురముండువారెంతటినిష్ఠురులు కావలయును. అందుచేతనే యిందు సురద్వేషులు వసించుచుందురు. అబ్బా! ప్రాణవల్లభా! నను నలేకుంటిని గదా.

గీ॥ (దుఃఖముతో) హృదయభారము నేభరి ♦ యింపజాల
కఠినశైలంబు లెగబ్రాకి ♦ కదలజాల
తపనసంతాపమునకు నే ♦ తాళజాల
నిడుదనట్టడవులను నే ♦ నడువజాల　22

రాము:— యోజనగంధీ! దుర్భరారణ్య విహారము సుఖమని దలచియుంటివా! కష్టదాయకమని తొలుత నే వినిపించితిని గదా? నే నెంతబ్రతిమాలినను నన్ను

విడువజాలక కష్టముల బ్రేమించుచున్నావు.

గీ॥ చిలుకపలుకులు వినలేని ♦ చిన్నదాన
బింకపు మృగాళిరవముల ♦ వినగవలసె
పిండివంటలు మెసవెడు ♦ పిన్నదాన
దుంపలాకులు పండ్లు భ ♦ క్షింపవలసె. 23

తే॥గీ॥ దీప్తికంబళ్లమీదను ♦ దిరుగుదాన
ముండ్లకంపల మీదను ♦ బోవవలసె
కనకచేలాంచలంబులు ♦ కట్టుదాన
కావిబట్టలు ప్రేమతో ♦ గట్టవలసె. 24

సీత:— నాథా! విధాత మననొసట నిట్లు లిఖించి యుండ దానిని దాటుట మనకు తరమా! కావున నాకొరకు చింతింపకుడు.

లక్ష్మ:— అగ్రిజా! పాపిష్ఠియగు కైకమూలమున గదా మనకిట్టుడుములు వాటిల్లినవి. ఆ పాపాత్మురాలిని కృపాణముచే బరిమార్చియున్న సౌఖ్యంబుగా నుందుము గదా?

రాము:— సోదరా! నీ కెన్నినీతి విషయంబులు బోధించినను నీ మౌర్ఖ్యము విడువజాలవుగదా.

లక్ష్మ:— పూర్వజుడా! మనలకష్టముల పాల్సేసిన రక్కసియెడ దయ యుంచుటతగునా?

రాము:— కనిష్ఠుడా! నీకుమతిపోయినదా? ఎట్టి దుర్భాష వాక్యముల బలుకుచున్నావు. నీ శౌర్యమంత యు జననిమీద జూపజొచ్చితివా? తుచ్ఛమైన లక్ష్మిశ్రీ నాశించి తల్లిని హింసించిన రవికులమంతయు నిశాపతిలేని తారలవలె చెడిపోవునుగదా.

లక్ష్మ:— అన్నయ్యా, జనకరాజపుత్రిక పడుకష్టము లుజూచి సహింపలేక నట్లంటిని. నామీద ననురక్తియుంచి యాగ్రహపడక నా నేరములు క్షమించుడు.

(విరాధుడసహ్యాకర రూపముతో వెలువడును)

విరా:— నేనీదినమెంత సుకృత్యము జేసియుంటిని! ఈ నాటికి నరమాంసము లభించినది. ఆహా! ఈ బాలిక బహుసుందరముగనున్నది. సితాకంటె బహురుచిగా నుం డును. ముందీపిల్లను మ్రింగెదగాక. (అని జనకాత్మజను పట్టుకొనును.)

సీత:— అయ్యో! జీవితేశ్వరా! (అని విరాధుని వి కృతహస్తములపై స్మృతితప్పును.)

లక్ష్మ:— సాధీయసుడా! వీనిమీద వేవేగ బాణవృ ష్టి గురిపింపుము. లేకున్న ముప్పుసంభవించును.

రాము:— (శరంబునువిడిచి) హేరాక్షసాధమా! ఇదే చచ్చితివిరా.

విరా:— ఓరీ! బాలకా (అని విశిఖంబునందుకొని

దుర్హించివైచి) నీవా నన్నుబఃమార్చునది?

రాము:— (తనలో) ఔరా విచిత్రముగదా! మరల పృషత్కంబును సంధించెదగాక. (తెరలో) ఓరీ శుక్రశిష్యా! యీ వ్రేటుకు మడియుదువురా. (అని ఖగంబును విరాధునిమీదికి విడుచును.)

విరా:— ఓరీ! నీ కలంబమే నాకింతతీపుగానున్న నిన్నును నీ వెనుకనున్న వానిని భక్షించిన నెంతరుచిగానుండునో! నాకీ స్త్రీతో పనియేమి? దీనిని విడిచెదగాక. (అని సీతనువిడిచి రామలక్ష్మణులను బట్టుకొనును.)

లక్ష్మ:— తీర్థపాదాధిపా! మనల వీడపహరించుకొనిపోకుండా వీనికక్షులు శరాఠించెదము. (అని యిరువురును నరుకుదురు.)

విరా:— (దుర్హింగి) ఓ పావనాకారులారా! మిమ్ముల దేవస్వరూపులని కనుగొంటిని. మీవలన నాకెప్పటి జన్మము సిద్ధించె. నేను తుంబరుడను గంధర్వుడను. నేనొకానొకదినము రంభాలోలుడనై, కిన్నరేశ్వరుని యాజ్ఞజవదాటినందున, నాతడాగ్రహపడి నాకీశాపమొసంగె. అంత నేనతని వేడుకొన, నామీద కరుణించి, శ్రీ మహావిష్ణువు కొన్నిదినంబులకు రామావతారమెత్తి, భార్య, తమ్మునితో దండకారణ్యంబున సంచరించుచు, యీ దారినివచ్చి నీ బాహుమూలములనెప్పుడు తెగనరకుదురో, యప్పుడునీకు శాప

విముక్తియగునని చెప్పెను. ఆ వాసరమునుండి మీ కొరకు వేచియుండి యిప్పటికి ధన్యుండనైతిని. నా శవమును భూస్థాపితము జేసితిరేని దివ్యరూపము దాల్చి ఇక మీరు జనుమార్గము చెప్పి వెడలెదను. రామచంద్రా, నీకివే నాసహస్రవందనములు.

రాము:— అనుజుడా, యీ సురద్విషుని బూడ్చివేయుము.

లక్ష్మ:— జగన్నివాసా, మంచిది.

రాము:— (విష్ణుపదము వంకజూచి) ఆ, విరాధా! ఏమిపలుకుచున్నావు! సమీపమున నున్న శరభంగ ఋష్యాశ్రమంబున వసించి, మరుదినమే పంచవటీతీరమునకు వెళ్లుమనియా నీవుపలికితివి. అట్లులే చేసెదము. లలనా! లేలెమ్ము విరాధుడు పరివర్తనము గావింపబడినాడు. జంకవలదు.

శ్యామల:— (అనిచదివి పుస్తకమునుమూసి క్రిందనుంచి) కథను సమాప్తి గావించితిని. ఇకను నానిలయంబునకు నే నరుగునట్టి వేళగాకున్నది. ఇంచుకతడవు శ్రీ కృష్ణభగవానుని బ్రశంసించెదగాక. అంతలోపలనే నానిలయంబున కరుగునట్టి కాలమాసన్నమగును.

—♦ స్రు వ కో కి ల. ♦—

సరసిజేక్షణశూరసత్తమ ♦ శంఖచక్రభుజార్గళా
పురుషసింహామ సర్వమోహన♦భోగితల్పజయేశ్వరా

సరసభూషణ శాంతభూషణ♦సత్యభామ ప్రియేశ్వరా
పరభృతంబులగెల్చువాక్కులు♦బాగుగాదయచేయుమా.

సీ॥ భీష్మపార్థివకన్య ♦ ప్రియప్రాణవల్లభ
కైవల్యపదమిచ్చి ♦ గావరాద
భక్తమాహాత్మ్య ♦ భరితభవ్యాకార
కైవల్యపదమిచ్చి ♦ కావరాద
భారతీశ్వశుర గో ♦ పాలజగన్నాథ
కైవల్యపదమిచ్చి ♦ కావరాద
అఖిలలోకనమస్కృ ♦ తాంఘ్రిపంకేరుహ
కైవల్యపదమిచ్చి ♦ కావరాద
గీ॥ యాదవాన్వయబీభత్స ♦ యనఘమిత్ర
దేవకీదేవిసత్పుత్ర ♦ దీనపోష
పురుషపుంగవద్వారకా ♦ పురనివాస
మోక్షపదమిచ్చి ననుగావు♦మోహనాంగ. 25

కం॥ ఈరేడ్భువనంబులకుఁ
కారణభూతుండవీవు ♦ కామితఫలదా
పోరాటంబులనందుఁ
పారనిసాహసుడవీవు ♦ భద్రిప్రియేశా. 26

—♦ మత్తకోకిల. ♦—

నిర్వికారనిరూఢనిర్గుణ ♦ నిర్భరామరపూజితా

సర్వ వేదసనాతనావ్యయ ♦ సత్కృపాభరణాంక, దో
ర్గర్వభంజనకుంజరార్చిత ♦ కామరూపశుభాకరా
సర్వమంగళనాథమిత్రిమ ♦ సర్వథాననుబ్రోవుమా.

—♦ అష్టపదసీసము. ♦—

శ్రీ శ్రీనివాసుండు ♦ క్షీరాబ్ధితల్పుండు
మధుసూదనుండు శ్రీ ♦ మాధవుండు
సత్యాకళత్రుండు ♦ పాజన్యగాత్రుండు
నతవిధేయుండు శ్రీ ♦ నగధరుండు
మిత్రాబ్జనేత్రుండు ♦ మిత్రవిందవరుండు
విగతమోహుండు స ♦ ర్వేశ్వరుండు
విశ్వేశ్వరాప్తుండు ♦ వేదవినోదుండు
రమ్యనాముండు నా ♦ రాయణుండు
శంఖచక్రధరుండు ♦ సదసత్ప్రకాశుండు
ఘనకిరీటుండు సం ♦ కర్షణుండు
మధుహరణుండు శ్రీ ♦ మత్పరంధాముండు
నరకాంతకుండు జ ♦ నార్దనుండు
సత్పాదకమలుండు ♦ సత్యప్రధానుండు
కృతలక్షణుండు శ్రీ ♦ కేశవుండు
ఆద్యంతశూన్యుండు ♦ సకలుపాచారుండు
విశ్వమయుండు త్రి ♦ విక్రముండు

తే॥గీ॥ ముకురసమవదనుండు దా ♦ మోదరుండు
సమగభీరుండు బుధజన ♦ సన్నుతుండు
శాంతభూషుండు నతులిత ♦ సాధనుండు
మము సుకీర్తులవెలయించి ♦ మనుచుగాత 29

గీ॥ ప్రాజ్యపర్వతములమించు ♦ పాపములును
నిన్ను కొనియాడినంతనే ♦ నిక్కముగను
కదురయంబున భీతిచే ♦ కదలిపోవు
పెన్నజూటూరిపురవాస ♦ ప్రియసుశీల
పరమపావనకేశవ ♦ భవవిదూర. 30

కం॥ సకలనిగమసంవేద్యుని
వికచాంభోరుహదళాక్షు ♦ వికృతివిదూరున్
మకరాలయశయనాంకుని
ప్రకటేశులుమెచ్చుభంగి ♦ భజియింతుమదిన్ 31

ఆ॥వె॥ వైజయంతివాడ ♦ వైకుంఠవాసుడ
దాసులదరిజేర్చు ♦ ధర్మమూర్తి
ముద్దులొలుకువాడ ♦ మునులపాలిటివాడ
బొమ్మతండ్రినన్ను ♦ బ్రోవరాద. 32

కం॥ సుందరకమలదళాక్షా
వందితసుత్రామవిశ్వ ♦ భావనసత్కా

నందిహృదయాబ్జభృంగా
నందనరకుమారనిన్ను ♦ సనయముదలతున్ 33

తే॥గీ॥ శోభనాకారు మహితయ♦శోవిలాసు
సర్వలోకశరణ్యు వం♦శపవిభూషు
కువలయేశు గుణాశ్రియు♦సవనరక్షు
మదినినుతియింతులక్షణ ♦ మహితునెపుడు. 34

ఇత్తెఱంగున మనశ్యామల శ్రీమదనగోపాలునతిభక్తితో
నిన మానసంబున పరిపరివిధంబుల స్మరించుచు మైమరచి
నిద్రించెను.

క॥ సాకేతపురనివాసున్
పాకటసీతాకళత్రు ♦ భవ్యచరిత్రున్
లోకాధిశవరేణ్యున్
పాకోత్తులతోడసతము ♦ ప్రణుతింతుమదిన్ 35

అని యీరీతి శ్రీరామాహ్వాయస్మరణంబుతో ప్రథ
మ ప్రకరణము సమాప్తిగావించి సిద్ధసంకల్పుడనయితిని.

శ్రీ శ్రీ శ్రీ.



# వి ష కే స రి.

## ♦ రెండవప్రకరణము. ♦

శ్రీనీళా హృదయేశ్వర
నానారూపావతార ♦ నందకుమారా
దానవ హార, భువనస్తుత
నీ నామస్మరణ మదిని ♦ నిరతమొనర్తున్

సీ॥ ఆముకురానన ♦ యనురాగ మొనగూర్చు
స్తనయుగంబుల, నాక ♦ సమునబోవు
పక్షులు వీక్షించి ♦ పండ్లనిభ్రమియించి
కడుసంభ్రమమున న ♦ క్కంబుకంఠి
కుచకుంభములదాకి ♦ క్రొవ్వనుబరుప నా
వనజాయతాక్షి ది ♦ గ్గునను లేచి

ఖగముల వెడలించి ♦ కంచు కంబుధరించి
చిత్తాబ్జమునను ♦ యోచించెనిటుల

శ్యామల:—

గీ॥ క్షీరసాగర శయను సం ♦ కీర్తనములు
బుధులు నానంద జలనిధి ♦ బొదలు నటుల
భక్తిసల్పుచునుండి ని ♦ ర్భయత నొడలు
మరచి నిద్రించితౌర యి ♦ క్కరణినేను 2

ఇపుడీ వృక్షావరిసంగంబుతో బనియేమి? (పొద్దు తట్టువీక్షించి.) ఆహా! ఈ దినంబేమో బహువిచిత్రము గానున్నది. ఇకను నాశాలకు నే జనునట్టి వేళగానున్నది. పూర్వమువలెనే కొలదిసేపు శ్రీ దేవకీ సద్గర్భముక్తాఫలుని బ్రణుతించి పొద్దుబుచ్చెదగాక.

ద్విపద.

శ్రీవాసుదేవ యా♦శ్రితపారిజాత
జీవావళి స్తోమ ♦ చిన్మయాకార
రాక్షసవిషభీమ ♦ రంగద్విలాస
పక్షీశవాహన ♦ వసుదేవపుత్ర
సకలసౌభాగ్యముల్ ♦ శాంతంబుగాను
నొకమారుదయచేయు ♦ మోపుణ్యపురుష. ౩

వనప్రియ ప్రతికంఠధ్వనిగల శ్యామలరమ్యగీతా

రావము బ్రహ్మాండంబంతయు వ్యాపించెను.

అట్టిసమయంబున సురేంద్రుడను యువకుడు కారు నందాసీనుడై బొంబాయికి బోవుచుండెను. కోకిలసాటి కంఠస్వరముగల మన శ్యామలగీతారావము నతండాలకించినవాడై "ఆహా, ఏమియీరాగము! సురవనితలా, గంధర్వవనవలలా, పాడుచున్న" దనుకొని ఆకసమువంక తిలకించెను. కాని యందెవ్వరును గానరానందున కారునాపి యిట్లాలోచనాసమగ్నుడయ్యెను.

సురేంద్రుడు:— ఏమిది వోద్యముగానున్నది! ఆ తెలిసినది! తెలిసినది!

చ॥ సరససమానశారద ర ♦ సాలవటాదిమహీరుహంబు
లుగా
పరమ లతాంతముల్ గలిగి ♦ భవ్యముగా చెలువొందు
చున్నయా
వరవనమందునుండియె సు ♦ వాసనమాదిరిగీతరావ
ముగా
సరిగను నాశ్రవంబులకు ♦ చాటుచునున్నది సత్వరం
బుగా
నరిగెద నాప్రశాంతవన ♦ మందలిసౌఖ్యమునింత బొం
దగా 4

అని యాతడు కారునుండి క్రిందికిదిగి తానుదలంచిన స్థలంబునకు పోవ నారంభించెను.

మన శ్యామల యెప్పటివిధంబుననే మృదుమధురకంఠ స్వరముతో గానముసల్పుచుండెను.

అంతలోపలనే సురేంద్రుడు శృంగారవనములోపల ప్రవేశించి దేవతాకన్యలమించి తనదేహకాంతిచే వనమునంత యు ప్రకాశింపజేయు శ్యామలను వీక్షించి, యప్పంకజముఖి తన్నవలోకించిన పారిపోవునను తలంపుతో నాతరాళక్షిని తస్కరింపవలెనను బుద్ధితోను చెట్లచాటున మెల్లగవొంగుచు, లేచుచు, నిక్కిజూచుచు, యా నవమోహనసుందరి సౌం దర్యామల తననెడద నిట్లు వర్ణింపుచు పోవజొచ్చెను.

సీ॥ నింద చంద్రుని సొరు ♦ నిరసించు నెమ్మోము
నీలాబ్జములసమ ♦ నేత్రములును
మకరకుండలముల ♦ మరపించుపాలిండ్లు
ధవళవర్ణాంచిత ♦ దంతములును
హర్యక్షమధ్యంబు ♦ హసియించునెరిగొను
రుధిరకాయలసాటి ♦ యధరములును
పలుకుతత్తడితోడ ♦ కలహించుపలుకులు
బంభరంబులబోలు ♦ వాలములును
గీ॥ పసపుపుట్టంబుగట్టి యీ ♦ వనమునందు

మెఱయుచున్నది రెండవ ♦ మిత్రుఁ బోలె
పుట్టినప్పటినుండియే ♦ నిట్టిదాని
గనివినియెఱుంగముల్లోక ♦ గరితలందు 5

శ్యామల:— ఏమి! యీ వనంబున నీదినమెందుం డియో నిర్ఘోషము నాకర్ణంబులకు వినబడుచున్నది. నర సంచరణములేని యివ్వనంబున నెవరుందురని సంభ్రమ దృష్టులతో నలుదిశల పరికింపసాగెను.

గుంతనేత్రములు, బుజ్జనాసిక, దృఢమైన సంహననము, కారుమబ్బుదేహచ్ఛాయయు వికలాంగములు గలిగియున్న క్రూరమనస్కుఁడగు సురేంద్రుని తిలకించినతోడనే మనశ్యామల లేడివలె బెదరి శీఘ్రముగ పాఱిపోవఁదొడంగెను.

సురేంద్రుఁడా యిగురుఁబోడి యందమును గాంచి వెనుకకుమరలలేక నిట్లరువఁజొచ్చెను.

కం॥ నీరజదళతుల్యాక్షీ
పారకుభీతిల్లి, నాదు ♦ పజ్జకు వేగన్
జేరిభవదీయకుక్షిన
కారుణ్యముతోడనన్ను ♦ గైకొనుమబలా. 6

కం॥ అరరే! యెంతటిజాణవె
హరిమధ్య, మదీయవాక్కు ♦ లణుమాత్రముగన్

పరిపాటింపకరయమున
జరిగెదవా! యెంతదవ్వ • జనియెదో చూతుగ. 7

అని మోహమును భరించుకొనలేక వేగముగాబోయి శ్యామలను పట్టుకొనబోయెను; కాని తనపని జరుగదాయెను.

శ్యామలకు వానిమాటలు వినినంతనే క్రోధముదయించెను. శరీరముకంపించెను. నిశ్చేష్టితవలె నిలువబడిపోయెను. సురేంద్రుడాయువిదను మరింతసమీపించి ఆవనజాక్షిసొగసును పరికించి "ఆహా! గరుడగంధర్వ యక్షకింపురుష యోషారత్నంబులకంటె మించి తనసౌందర్యబాజుచే విశ్వంబంతయు శోభించుచున్నది. ఎట్టులైన నీయలికులవేణిని లోబరచుకొని మహాసుఖముబొందని నాపురుషజన్మము కాల్చనా"! యని తనమానసంబున దలంచి యాలలనామణిని యాలింగనము చేయబోయెను. (ఇంచుక వెనుకకుజరిగి)

శ్యామల:— ఓ వివర్ణుడా! సాధ్వీమణుల స్పృశించుటకు త్రిమూర్తులకైన నలవిగాదు. ప్రతివ్రతల మహిమ దెలిపెద నాలకింపుము.

తే॥గీ॥ బాడబజ్వాలలంటియు • బ్రతుకవచ్చు
కుధరపంక్తులపిండిగ • గొట్టవచ్చు

వ్యాళములబట్టియాడింపవచ్చు ♦ పరమ
సాధ్వీనులదాకుటేరికి ♦ సాధ్యమగునె! 8

మరియు

గీ॥ ఆతురత బోవు చిత్రుని ♦ యాపవచ్చు
దారుణంబగు వహ్నిని ♦ దాటవచ్చు
ఖగమువలె మింటిపై దిరు♦గాడవచ్చు
సాధ్వీనుల దాకు టేరికి ♦ సాధ్యమగునె! 9

ఓ యజ్ఞుడా! నీకింకను నీతి బోధించెదవినుము. తొల్లి ద
మయంతిని కిరాతుడు తన్ను వరింపమని పలుక నాప్ర
తివ్రతాతిలక మా మృగయుని దగ్ధముగావింపలేదా? సీ
తామహాదేవిని దశాస్యుడపహరించి బంధుమిత్రపుత్రసమే
తంబుగా గూలలేదా? పరవనితల నాశించి యమదండనకు
బాల్పడుట తగునా? నాసోయగమునకు భ్రమించి మోహా
మందు తగుల్కొన తగునా? అనేకదుర్గంధములతో నిమిడి
యున్న యీ యస్థిపంజరమును జూచి వాంఛించుట తగునా?
ఓ వికలాంగుడా, నీవికనైన నీ నీచమగు తలంపునుమా
ని వచ్చినదారినిబట్టి వెడలిపొమ్ము" అనియెను. అతియ
మోహహృదయుండగు సురేంద్రునికి యా వరవర్ణినచెప్పిన అ
మృతతుల్యమగు మాటలు శిరస్సున కెక్కలేదు. ఎటులె
క్కును?

తే॥గీ॥ భాస్కరునిమ్రింగియైనను ♦ బ్రతుకవచ్చు
నిలతలంబంత నరచేత ♦ నెత్తవచ్చు
నబ్ధివినువీధిచాపగ ♦ జుట్టవచ్చు
దామసునిబుద్ధి దిప్పుట♦దరముగాదు. 10

అదేవిధముగా శ్యామల వినిపించినపలుకులు పాపాత్ముండగు సురేంద్రుఁడు పెడచెవినిబెట్టి యాలతాంగితో యీప్రకారము భాషింప మొదలిడెను.

సురే:— మృగాక్షీ! నే నిక పుష్పశరుని బాణపరంపరల కోర్వఁజాల. నా మీద యనుకంపముంచి నా యభిలాష త్రోసివేయక నన్ను కలియుము” అనియెను.

శ్యామల:— (క్రోధముతో) ఛీ చండాలుడా! నా యెదుటనుండిపొమ్ము. (అని గిరుక్కున వెనుకకు మరలినది.)

సురే:— (రౌద్రముతో) ఆ! నీలఘనవేణి! పరుగిడ జొచ్చెదవా? (అని త్వరితముగాబోయి యామె ప్రివేష్టముల బట్టుకొనెను. ఆమెవదలించుకొనబోయెను.) నీకంటే ధీరుని లాగుకొనిన ఫలములేదని యా మూర్ఖుడనెను. శ్యామల యొక్క వెఱ్ఱికేకవైచెను. నీ యరపు వినువారెవ్వరియ్యెడలేరు. నీ కంఠధ్వని యెవ్వరికిని వినబడనేరదని సురేంద్రుడనెను.

శ్యామల:— (నేత్రములనుండి ప్రళయవిస్ఫులింగములురాల) ఛీ ఘాతకుడా! నగళ తుల్యమగు శారీరమును పండువెన్నెలవలె వరగిలించు నాయొడలునకు తాకనియ్యకుము. నేనుశాపంబొసంగిన నీ సత్కులంబెల్ల ధ్వంసముగావింతును. నన్నువిడువుము. విడువుము.

సురే:— కృశోదరీ! నేను శాపములకు భయకంపితుడనుగాను. నిన్నొక్కయడుగైనను కదల నివ్వను. లాగుకొని నచావగొట్టెద సుమీ.

శ్యామల సురేంద్రుని గర్జితోక్తులకు మిగుల భయకంపితయై గద్గదస్వరముతో నరచెను. సురేంద్రుని కరములనుండి విడిపించుకొన యత్నించుచు జాతి కటికనేలపై స్మృతి దప్పెను. మహాశయా! మన చిన్ని శ్యామల మూర్ఛాపరవశురాలైనదిగాంచి యజాండంబంతయు నేరీతి యుండెనంటే,

గీ॥ విష్కారము లన్ని కన్నీరు ♦ విడుచు చుండె
వృక్షములు గాలి నెట్టిదో ♦ వీవకుండె
క్రూరమృగములు భోరున ♦ గుందు చుండె
సోమసూర్యులు మరుగున ♦ జొచ్చి రపుడు. 11

దుష్టచేతస్కుండగు సురేంద్రుండీడే సమయంబని శ్యామల నెత్తుకొని పోయి తన కారునందుంచి తానును గూర్చొని బొంబాయికి యర్ధమైలుదూరమున చొరరాని యొక

వడపుమందిరమునందుంచి యిప్పుడిబ్బాలారత్నంబునుబలవం తపెట్టుటకు సమయంబు గాదనిదలంచి మండలాగ్రము వలక రంబున దాల్చి గుహవెలుపలికి వచ్చి గుహాద్వారంబుబంధిం చి యిటాలోచనానిమగ్నమానసు డయ్యెను. నేనిపుడు సు కేంద్రుడను నామంబుతో ద్రిమ్మరినయెడల నే గావించినపని బయట బడును. కాన నేదైన మారుపేరు ధరించెద గాక. (కొలది సేపాలోచన నభినయించి) సెబాస్! మంచి నామ ము జ్ఞప్తికివచ్చెను. 'విషకేసరి' యని పేరుపెట్టుకొని నాయిష్టా నుసారము సంచరించి వచ్చెద గాక.

ద్వితీయ ప్రకరణము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ





# విషకేసరి.

## —♦ మూడవప్రకరణము. ♦—

క౦॥ శ్రీరమణీయవినోదన
ధారాధర శ్యామగాత్ర ♦ ధర్మచరిత్రా
క్షీరాబ్ధితల్పభరణా
నారదవీణానులాప ♦ నందసుపుత్రా.

రాత్రి పదిరెండుగంటలాయెను. సకలగుణసంపన్నుండగు పుండరీకుడు తనభవ్యాత్మసుత యీవేళకును శృంగారవనంబునుండి నిజమందిరంబున కేతెంచలేదని యిటులత లపోయసాగెను.

వడపుమందిరమునందుంచి యిప్పుడిబ్బ్యాలారత్నంబునుబలవం తపెట్టుటకు సమయంబు గాదనిదలంచి మండలాగ్రము వలక రంబున దాల్చి గుహవెలుపలికి వచ్చి గుహద్వారంబుబంధించి యిటాలోచనానిమగ్నమానసు డయ్యెను. నేనిపుడు సురేంద్రుడను నామంబుతో ద్రిమ్మరినయెడల నే గావించినపని బయట బడును. కాన నేడైన మారుపేరు ధరించెద గాక. (కొలది సేపాలోచన నభినయించి) సెబాస్! మంచి నామము జ్ఞప్తికివచ్చెను. 'విషకేసరి' యని పేరుపెట్టుకొని నాయిష్టానుసారము సంచరించి వచ్చెద గాక.

ద్వితీయ ప్రకరణము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ







# విషకేసరి.

## మూడవప్రకరణము.

క౦॥ శ్రీరమణీయవినోదన
ధారాధర శ్యామగాత్ర ♦ ధర్మచరిత్రా
క్షీరాబ్ధితల్పభరణా
నారదవీణానులాప ♦ నందసుపుత్రా.

రాత్రి పదిరెండుగంటలాయెను. సకలగుణసం పన్నుండగు పుండరీకుడు తనభవ్యాత్మసుత యీవేళకును శృంగారవనంబునుండి నిజమందిరంబున కేతెంచలేదని యిటులం లపోయసాగెను.

ఏమీ! యీదినముచాలా విస్మయంబుగానున్నది. అ
నిశముద్యానవనమునుండి యరుదెంచినంగోడనే జనకా! భోజ
నంబునకురమ్మని మృదుమధురోక్తులతో బిలుచు శ్యామల
యీసరికిని దివ్యశుభప్రదాయి యగుసుమవనంబునుండి రా
కుండుటకు హేతు వేమైయుండవచ్చును. గోపతికథలయంద
పేక్ష గల కమలయు నీదినము నాప్రతిశ్రయంబునకు రాకుం
డుట మరింత యాశ్చర్యకరముగా గనుపట్టుచున్నది. ఆ నిను
పారుకుముద బాంధవసన్నిభముఖియు నాతనయను వెంబడించి
యుజ్వలవనంబున కరిగియున్నదో లేక నాహంసగమన తన
నిశాంతమందేయుండి యింకను రాకున్నదో, ఆ కమలసంగతి
యు నాకేమియు తెలియదాయెను. నానవ్యసుతాగ్రజను వ
నంబున దిక్కులేకనున్నది గాంచి యేదస్యుడైన సైన్యము
నర్చెనో, లేక వల్కలములుగట్టి యన్నాహారంబులు విసర్జించి
పవమానంబునే యాహారంబుగా భావించుకొని ప్రపంచసౌ
గ్యాదులవీడి శాశ్వతసన్యాసవృత్తి నవలంబించి శ్రీమన్నా
రాయణునిగూర్చి తపంబాచరించుటకు పేరారణ్యప్రాంతం
లకరిగెనో, నాకీవిషయము బోధపడదాయెను. నాకొకా
కదినము నే నేకాంతంబుగా నున్న సమయంబున నాము
ద్దుబిడ్డ యిట్లని వచించి యుండెను. తండ్రీ! ఈకలియుగము
నా అనేకమంది దుర్జనులు శ్రీరామనామస్మరణం బన నెట్టి
దో తెలియక జ్ఞానశూన్యులై తళుకు బెళుకులతో మోసా

లోలురై ద్రిమ్మరుచు నెట్టకేలకు నరకంబున కర్హులగుచున్నారు. దుష్టజవ్వనులు అగ్నిసాక్షిగ జేకొన్న ప్రాణవల్లభుల విడనాడి రోవెలదులభంగి జారతనంబుతో సంచరించుచు వంశంబుల కపఖ్యాతి దెచ్చుచున్నారు.

జనకా! నీకిక నుకపటసంసారమును గూర్చి బోధించెద సావధానమనస్కుడవై యాలకింపుము. గృహిణులు మృత్యువు సాటివారు. బంధువులు కపటచోరులు. నందనులు ఋణానుబంధులు. వస్తువులస్థిరములు. కార్యార్థులన్యులు. కనుక జనకా! కిల్బిషములకు తగినదైన యీ దోయిడిసంసారంబును పారదోలి కటివిరాజత్పీతకౌశేయవాసుండును, నీలజలధరతుల్యశరీరుండును, దరదరవిందసుందరపత్రరుచిరాక్షుండును, రాకావిరాజమానరాజమండలసమవదనుండును, కమనీయనవరరత్నఖచితకంఠికాలంకృత కంధరుండును, ఆజానుచతుర్భుజుండును, ప్రభాతభాసమానరాజమాన రాజమార్తాండవిమలశ్వశ్రేయససంకాశఘనకిరీటుండును, సత్పద్మాస్త్రిశతకోటిలావణ్యుండును, అఖిలలోకార్చితచరణయుగ్మళబిసప్రసూనుండును, అకలంకోజ్వలదివ్యమండనుండును, శిష్టజనమానసోల్లాసుండును, సుచారిత్రరిపుజైత్రుండును, బాంధవపరికరావనుండును, సర్వలోకప్రశస్తుండును, నీడోద్భవాన్వయనాయకవరతురంగుండును, శ్రీరమామానసాబ్జచోరుండును, పావననత శ్రీపెన్న

ఏమీ! యీదినముచాలా విస్మయంబుగానున్నది. అనిశముద్యానవనమునుండి యరుదెంచినజోడనే జనకా! భోజనంబునకురమ్మని మృదుమధురోక్తులతో బిలుచు శ్యామల యీసరికిని దివ్యశుభప్రదాయి యగుసుమవనంబునుండి రాకుండుటకు హేతువేమైయుండవచ్చును. గోపతికథలయందపేక్ష గల కమలయు నీదినము నాప్రతిశ్రయంబునకు రాకుండుట మరింత యాశ్చర్యకరముగా గనుపట్టుచున్నది. ఆ నిమపారుకముద బాంధవసన్నిభముఖయు నాతనయను వెంబడించి యుజ్వలవనంబున కరిగియున్నదో లేక నాహంసగమన తన నిశాంతమందేయుండి యింకను రాకున్నదో, ఆ కమలసంగతియు నాకేమియు తెలియదాయెను. నానవ్యసుతాగ్రజను వనంబున దిక్కులేకనున్నది గాంచి యేదస్యుడైన స్త్రైణ్యము నర్చెనో, లేక వల్కలములుగట్టి యన్నాహారంబులు విసర్జించి పవమానంబునే యాహారంబుగా భావించుకొని ప్రపంచసౌఖ్యాదులవీడి శాశ్వతసన్యాసవృత్తి నవలంబించి శ్రీమన్నారాయణునిగూర్చి తపంబాచరించుటకు పేరారణ్యప్రాంతంబులకరిగెనో, నాకీవిషయము బోధపడదాయెను. నాకొకానొకదినము నే నేకాంతంబుగా నున్న సమయంబున నాముద్దుబిడ్డ యిట్లని వచించి యుండెను. తండ్రీ! ఈకలియుగములో అనేకమంది దుర్జనులు శ్రీరామనామస్మరణం బన నెట్టిదో తెలియక జ్ఞానశూన్యులై తళుకు బెళుకులతో మోసా

లోలురై భ్రమ్మరుచు నెట్టకేలకు నరకంబున కర్హులగుచున్నా రు. దుష్టజవ్వనులు అగ్నిసాక్షిగ జేకొన్న ప్రాణవల్లభుల వి డనాడి రోవెలదులభంగి జారతనంబుతో సంచరించుచు వం శంబుల కపఖ్యాతి దెచ్చుచున్నారు.

జనకా! నీకికనుకపటసంసారమును గూర్చి బోధించెద సావధానమనస్కుడవై యాలకింపుము. గృహిణులు మృత్యువు సాటివారు. బంధువులు కపటచోరులు. నందనులు ఋణాను బంధులు. వస్తువులస్థిరములు. కార్యార్థులన్యులు. కనుక జ నకా! కిల్బిషములకు తగినదైన యీ దోయిడిసంసారంబును పారద్రోలి కటివిరాజితపీతకౌశేయవాసుండును, నీలజలధరతు ల్యశరీరుండును,దరదరవిందసుందరవక్త్రరుచిరాక్షుండును, రా కావిరాజమానరాజమండలసమవదనుండును, కమనీయనవర రత్నఖచితకంఠికాలంకృత కంధరుండును, ఆజానుచతుర్భుజుం డును, ప్రభాతభాసమానరాజమాన రాజమార్తాండవిమలశ్వే త్ప్రియుసంకాశఘనకిరీటుండును, సత్ప్రద్మాస్త్రశితకోటిలావ ణ్యుండును,అఖిలలోకార్చితచరణయుగ్మళబిసప్రసూనుండును, అకలంకోజ్వలదివ్యమండనుండును, శిష్టజనమానసోల్లాసుండు ను,సుచారిత్రరిపుజైత్రుండును, బాంధవపరికరావనుండును,స ర్వలోకప్రశస్తుండును, నీడోద్భవాన్వయనాయకవరతురంగుం డును, శ్రీరమామానసాబ్జచోరుండును, పావననత శ్రీపెన్న

జూటూరిపురనిలయుండనగు శ్రీమన్నారాయణుని గూర్చి తపమునకుజనుదమని మృదుమధురోక్తులచే నోరాడి యుండెను. అదేవిధంబుగా సంసారంబును పరిత్యజించి పారికాంక్షపాత్రను దాల్చి తపమారాధించుటకు కాననంబుల కరిగెనో, లేక తన సఖీరత్నంబగు కమలధామంబున నిలచి పొద్దుగ్రుంకిన దని చీకటిలో రాజబాలిక యహార్పతి జన్మించినతోడనే బోవచ్చునని యక్కడనే పరుండినదో తోటకు బోయి యరసి గాని యే సంగతి దృఢముగా తెలియదని పరిపరివిధంబుల దలంచి యెట్టకేలకు యింటి వెలుపలికి వచ్చి శిబిరద్వారంబుల బంధించి యాకటికచీకటిలో దానెందు బోవునది నగరమందున్న తనమిత్రసంఘంబున కెరిగించిన తనపని కాలస్య మగునని యెవ్వరికినివినిపింపక శీఘ్రంబుగ వనాభిముఖుండై పోయెను.

ఇట్లు

సీ॥ శ్రీసుంకమాంబసం ♦ సేవ్యగర్భాంశుండు
సుంకిరెడ్డిమనీషి ♦ శుభసుతుండు
పద్మేశపాదాబ్జ ♦ వంశాబ్ధిసోముండు
శుభ్రాంశసంకాశ ♦ శోభితుండు
వరపాకనాటి య ♦ న్వయవార్ధిచంద్రుండు
ఇనుమద్దిసద్గోత్ర ♦ దినకరుండు
భూసురపాదసం ♦ ఘా జనాసక్తుండు
అవని రంగస్వామి యనెడు ఘనుడు

గీ॥ సకలమర్త్యులు ముదమున ♦ సన్నుతింప
వ్రాసె నీ పుణ్యచరితము, ♦ భక్తితోడ
పఠన మొనరించు వారికి ♦ ప్రాకటముగ
భారతీసేవ జేసిన ♦ భాగ్య మొదవు.

మూడవ ప్రకరణము సమాప్తము.

ప్రథమ భాగముసమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



ాటూరిపురనిలయుండునగు శ్రీమన్నారాయణుని కూర్చి తపమునకుజనుదమని మృదుమధురోక్తులచే నోరాడి యుండెను. అదేవిధంబుగా సంసారంబును పరిత్యజించి పారికాక్షపాత్రను దాల్చి తపమారాధించుటకు కాననంబుల కరిగెనో, లేక తన సఖీరత్నంబగు కమలధామంబున నిలచి ప్రొద్దుగ్రుంకినదని చీకటిలో రాజాలక యహర్పతి జన్మించినతోడనే బోవచ్చు నని యక్కడనే పరుండినదో తోటకు బోయి యరసిగాని యే సంగతి దృఢముగా తెలియదని పరిపరివిధంబుల వలంచి యెట్టకేలకు యింటి వెలుపలికి వచ్చి శిబిరద్వారంబుల బంధించి యాకటికచీకటిలో దానెందు బోవునది నగరమందున్న తనమిత్రసంఘంబున కెరిగించిన తనపని కాలస్య మగునని యెవ్వరికినివినిపింపక శీఘ్రంబుగ వనాభిముఖుండై పోయెను.

ఇట్లు

సీ॥ శ్రీసుంకమాంబసం ♦ సేవ్యగర్భాంశుండు
　　సుంకిరెడ్డిమనీషి ♦ శుభసుతుండు
పద్మేశపాదాబ్జ ♦ వంశాబ్ధిసోముండు
　　శుభ్రాంశసంకాశ ♦ శోభితుండు
వరపాకనాటి య ♦ న్వయవార్ధిచంద్రుండు
　　ఇనుమద్దిసద్గోత్రి ♦ దినకరుండు
భూసురపాదసం ♦ పూజనాసక్తుండు
　　అవని రంగస్వామి యనెడు ఘనుడు

గీ॥ సకలమర్త్యులు ముదమున ♦ సన్నుతింప
వ్రాసె నీ పుణ్యచరితము, ♦ భక్తితోడ
పఠన మొనరించు వారికి ♦ ప్రాకటముగ
భారతీసేవ జేసిన ♦ భాగ్య మొదవు.

మూడవ ప్రకరణము సమాప్తము.

ప్రథమ భాగముసమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



# రాజలక్ష్మీ ప్రతాపచంద్ర విజయము

## (అపూర్వ చారిత్రిక నవలారాజము.)

**కొలది ప్రతులు మాత్రమే!**　　**ఆలసించిన ఆశాభంగమే!**

కల్పితకథలకన్న చరిత్రలే యెక్కువ యానందము గూర్చును. మన పవిత్రమైన హిందూదేశములోని యోధుల చరిత్ర దెలుసుకొనుట ప్రతిహిందువుని కర్తవ్యము. జాతీయ భావములు కల యేహిందువుడు గూడ హిందూదేశ చరిత్రను తెలుసుకొనుటకు పెడమొగము బెట్టడు.

ఈ రాజలక్ష్మీ ప్రతాపచంద్ర విజయములో హిందూదేశ చరిత్ర ప్రధానవస్తువు. మొఘలులకాలములో జలాలుద్దీను ఢిల్లీసింహాసనము నేలునాడు జయపురముకోటను పాలించుచుండిన జయచంద్రుని కడపటికొడుకగు ప్రతాపచంద్రుని కథ యిందు బొందుపఱచబడినది. ఉన్నముక్క లున్నట్టువ్రాసిన చదువరుల నుఱ్ఱూతలూగింప జాలదు కాన నచ్చటచ్చట రసవంతములగు కొన్నిమార్పులు చేయబడినవి. అద్భుత భయానకఘట్టము లిందెన్నియేని గలవు. మొదటి ప్రకరణములోని తురకలసంభాషణలో రాయలసీమతురకల తెలుగు బహుచక్కగ నుపయోగింపబడినది.　　వెల రు. 0-8-0

వలయువారు;—

జె. రంగస్వామిరెడ్డి,
జూటూరు.
తాడిపత్రి తాలూకా,
అనంతపురం జిల్లా.

(లేక)

జె. రామచంద్రారెడ్డి,
కోడూరు.
తాళ్ళప్రొద్దుటూరు పోష్టు.
జమ్మలమడుగు తా॥ కడపజిల్లా.

